Reg. No. 757

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక.

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు

జానపాటి పట్టాభిరామశాస్త్రిచేఁ

ప్రచురింపఁబడుచున్నది.

జానపాడు.

సంపుటము 18 { 1926 సం॥ డిశెంబరు నెల. } సంచిక 9

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 | 0 | 0 | సహాయులకు | రు 5 | 0 | 0 |
| పోషకులకు | రు 10 | 0 | 0 | చందాదారులకు | 3 | 0 | 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Janapadu by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

## ప్రధానపోషకులు.

౧ శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు, వెనికేపల్లి.
౨ శ్రీ శ్రీ జగద్గురు పుష్పగిరి స్వాములవారు, చినవీరవల్లి.
౩ బాకరాజు పరాంకుశరావుదేశాయిగారు. యాడవరం.
౪ రామలింగుగారు- నెల్లుట్లపాపురసంస్థానముల మేనేజరు- నెల్లుట్ల.
౫ శ్రీమద్వేంకటశేషారెడ్డి రామచంద్రారెడ్డి దేశముఖుగార్లు, అల్లాదుర్గసంస్థానము.

## పోషకులు

౧ శ్రీ శ్రీ జగద్గురు అభినవ విరూపాక్ష పీఠాధిపతులు, జామిఅగ్రహారం.
౨ ఎనమండ్ర లక్ష్మీనరసింహముగారు, మర్చెంటు, బెజవాడ.
౩ రాజా వెంకటాద్ర్యప్పారావు, బహదరుగారు, వుయ్యూరుయెస్టేటు.
౪ రాజామంత్రిప్రగడ వెంకటహనుమంతరావు, రాఘవరావుగార్లు, లింగగిరి.
౫ తంగెడ నరసింహారావుగారు, కరణం, మోర్జంపాడు.
౬ శ్రీరామయాంబికా పుస్తకభాండాగారము, లక్ష్మీనర్సాపురము.
౭ లింగాల వెంకటరెడ్డి దేశముఖుగారు, కుందవరము
౮ చారబుడ్డి రత్నారెడ్డిపటేలుగారు, న్యాలపోగుల
౯ లింగాల సీతారామరెడ్డి బండారెడ్డి, దేశముఖుగార్లు- నారాయణపురము
౧౦ టి. లక్ష్మణసింగుగారు, జొనగాం
౧౧ నెల్లుట్ల నరసింహారావుగారు, జొనగాం
౧౨ రంగాచారులుగారు, ముక్తాగారు, దేశముఖు, మసీదుపల్లె.
౧౩ కేతులపల్లి కృష్ణారెడ్డిగారు, కేశవాపురము.
౧౪ బాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు
౧౫ పిడుపాటి వెంకటరాయశర్మగారు, కరవది
౧౬ శ్యామాపంతుల వెంకటేశ్వరరావుగారు, తహశీల్దారు, సిరిసిల్ల.
౧౭ గూడూరి వీరసాంబశివరావు సర్దేశపాండ్యాగారు, మానుకొండూరు
౧౮ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యులఅయ్యవార్లంగారు- [illegible]
౧౯ కొత్వాలి వెంకటేశ్వరరావుగారు, సంగెం

---

## సహాయులు

౧ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౨ బుడంపాటి సుబ్బయ్య గారు, మర్చంట్, కాకినాడ
౩ సంగెం రామారావుగారు, సంగెం
౪ పెద్దిభట్ల వీరయ్యగారు, ప్లీడరు బెజవాడ
౫ నెల్లుట్ల కేశవరావు దేశముఖుగారు, నెల్లుట్ల
౬ రంగావఝ్ఝల రంగయ్యగారు, నర్సారావుపేట

సంపుటము ౧౮ | జానవారి / క్షయ సం॥ మార్గశిర మాసము | సంచిక ౯


## కాశీశ్వరస్తుతి.

శ్లో॥ యస్స్వప్తావరణాంతరాళసదనే శ్రీలింగరూపీ శివః
స్థిత్వా విశ్వపతీతి సర్వజగతి ఖ్యాతిం గత శ్శంకరః
యః కాశ్యాం త్రిజగత్పవిత్రకరటినీతీరేర్చిత స్సూరిభిః
స శ్రీవిశ్వపతి స్సదాతిదయయా మాం పాతు కాశీశ్వరః. ౧

శ్లో॥ భూలాలయామరుణోదయే శివతిథౌ పక్షేసితే బాహులే
మాసే శ్రీమణికర్ణికాంభసి హరి స్స్నాత్వాక్షిపద్మేన వై
యం సంపూజ్య సులబ్ధవా నరిహరం చక్రం వరం చేశ్వరాత్
స శ్రీవిశ్వపతి స్సదాతిదయయా మాం పాతు కాశీశ్వరః. ౨

శ్లో॥ తం భక్తం కృపయాభిషేచ్య చ హరిం స్సద్రత్నసింహాసనే
నానాసింధుసరిత్ఫలౌషధిరసై స్సంసిచ్య తస్మై దదౌ
సామర్థ్యం త్రిజగత్సపాలనకరం సర్వాధికారం చ యః
స శ్రీవిశ్వపతి స్సదాతిదయయా మాం పాతు కాశీశ్వరః. ౩

శ్లో॥ యః కాశ్యాం మృతజంతుకర్ణవివరం స్పృష్ట్వా స్వహస్తేన వై
మా భూదస్య పునర్భవ స్త్వితి వద న్ముక్త్యై దదాతి స్వయం
సంచార్ణం స్వమనుంచ తారసహితం స్వేష్టాక్షరం వా మనుం
స శ్రీవిశ్వపతి స్సదాతిదయయా మాం పాతు కాశీశ్వరః. ౪

శ్లో॥ పంచక్రోశపరిక్రమా త్కృతమహాపాపక్షయ స్సంతతం
స్వాచ్ఛ్యో యస్య కృపావశా ద్భవతిచ స్వర్ణం సుతప్తం యథా
ఖ్యాతం క్షేత్రవరే సదాచరణతో యః పాతి పుత్రం యథా
స శ్రీవిశ్వపతి స్సదాతిదయయా మాం పాతు కాశీశ్వరః. ౫

శ్లో॥ యః కాశీస్థిత పస్తలింగ నిలయః శ్రీవిశ్వనాథ స్స్వయం
తత్క్షేత్రాపి సమర్చనా దిహనరో విశ్వేశ్వరార్చానమం
ప్రాప్నోత్యేవ ఫలంచ యస్యదయయా సందర్శనాత్సర్శనాత్
స శ్రీవిశ్వపతి స్సదాతిదయయా మాం పాతు కాశీశ్వరః. ౬

శ్లో॥ విష్ణు బ్రహ్మ సురేంద్ర సిద్ధ ఋషి మర్త్యా యక్షగ సాధ్యాస్సదా
గంధర్వాసురకిన్నరోరగనరా విద్యాధరా వానరాః
సర్వే యస్య సమర్చనా దహరహః ప్రాపు ర్యథేష్టం వరం
స శ్రీవిశ్వపతి స్సదాతిదయయా మాం పాతు కాశీశ్వరః॥ ౭

శ్లో॥ కాశ్యాం భైరవదండపాణిగణరా డ్గంగాన్నపూర్ణాన్వితః
కాశీవాసజనానసైకసపుణః కైవల్యముక్తిప్రదః
యః పాత్యత్తి కరోతి లోక మఖిలం కైలాసనాథస్స్వయం
స శ్రీవిశ్వపతి స్సదాతిదయయా మాం పాతు కాశీశ్వరః॥ ౮

శ్లో॥ యో భక్త్యా పఠతీశ్వరాష్టక మిదం కాశీబహిస్థోపివా
కాశీవాసఫలం సదైవ లభతే శ్రీవిశ్వనాథాజ్ఞయా
కాశ్యాం స్త్రీ పురుషోపివా యది మృతే విశ్వేశసత్ప్రాంతరో
జీవన్ముక్తిదశా ముపేత్య లభతే కైవల్య మంతే ధ్రువం॥ ౯

ఈ కాశీశ్వరాష్టకము దక్షిణామూర్త్యాశ్రమ స్వాములవారు మా కార్యస్థానమున కంపియున్నవారు, వీరందరు లేయయ్యా ౧౦సం॥ నుండి కాశీక్షేత్రముననే నివసించుచున్నారు. పరమవిరాగులు. పక్వ పదార్థములం బుచ్చుకొనక కేవలము కందమూలఫలాశనులయియే దేహయాత్ర చేయుచుండిరి. పైశ్లోకములు తద్వతి ప్రణీతములే యై యుండవచ్చును లేక సనాతనములేనో తెలియదు. ఎవరుచేసినవైనను భక్తజనుల కవశ్యకరణీయములై సద్గతినొసంగుటకు సంశయము లేదు. కావున నందఱును నహరహంబును బారాయణమునం బెట్టుకొనుటకుం బ్రబోధితులు.

సంపాదకుండు.

# తిరుపతి వెంకటకవులు

తెలుగుభాషలో నిటీవల మొలకెత్తి, నలుమొగముల నల్లికొని, క్రొత్తపోకడల మించి మెరయు, కవితారంభంపు మొగసాలc దిరుపతి వెంకటేశ్వరులు నిలబడియున్నారు. ప్రాచీనాంధ్ర సారస్వత సారమంతయు లక్ష్యలక్షణ సమన్వితముగ వీరిలో జీర్ణించి యుండెను. వర్తమాన కాలమున మానవజాతులలో కావ్య కళాదులగూర్చి జరుగుచున్న భావవిపర్యయముల జక్కగ గుర్తించు వివేకము వీరి కమితి యుండెను. ప్రాచీనాంధ్ర భాషాసంప్రదాయముల నూతన కాలోచిత విషయముల కుపకరింపజేసి, ప్రాచీన లక్షణమర్యాదల నవీనాదర్శములకు జతపఱచి, కావ్యముల యొక్కయు, లక్షణగ్రంథముల యొక్కయు, పరస్పర సంబంధముల గుట్టుమట్టుల గమనించి, స్వాతంత్రించి, క్రొత్తపోకడల మించి దారిజూపెడి మేటిమగంటిమి వీరి కొప్పుచుండెను. స్వాతంత్రించి మొదలిడిన కావ్యవైఖరుల దిగంతముల వ్యాపింపజేసి, భావిప్రయత్నములకు నలయు నుత్సాహోద్వేగముల నుత్పత్తిజేయదగు ఆత్మవిశ్వాసము, ఔదార్యము, పట్టుదల, వాదోత్సాహము, ధైర్యము వీరియం దుండెను. ఆంధ్రకవితోపాసకుల భూత వర్తమాన భావిజీవితగతులు వీరి జీవనములో గోచరింప, నవ్యాంధ్ర కావ్యరీతులు వీరి మానసారామనిబంధముల బలుతెరవుల వెలయ తిరుపతి వెంకటేశ్వరు లీనాటి తెలుగుపోకడల నాయకులై, నేతలై, సూత్రధారులై యుగకర్తలై వెలుగుచున్నారు.

వీరి జీవితాంశముల తెలుగువారెల్ల రెరుంగుదురుగాన వాని నీయెడ విస్తరించము. ప్రాచీన గురుశిష్యసంప్రదాయముల నేటివరకు నిలుపుచు, నిరుపమశిష్యవాత్సల్యమునను, పరహితాపేక్షచేతను, వేల కొలదిశిష్యుల సంపాదించి, సత్స్నేహధర్మములచే నిలుపుకొనజాలు సత్పురుషులు. చమూనాథులకుండు ఆశ్రితపక్షపాతము, నిరాఘాట

ప్రచారము, నిర్భయసమరోత్సాహముగల్గి వీరకరుణారసముల కాలవాలము, శాపానుగ్రహశక్తులొప్పుచు, **నాయకస్వరూపమును** నిండువెలుగున ప్రకటింపగల ధీమంతులు. వీరు నిరంతర కావ్యరసోపాసకులు ప్రాచీనకవులయెడను, తమ కావ్యములపట్లను, ఆరనియుత్సాహముత్పత్తిజేయగల తన్మయత్వము వీరి కలవడెను. ప్రాచీనకావ్యసాంఘికమర్యాదలయందు గౌరవముంచుచు, వానినవసరముగ నిర్హేతుకముగ ఖండింపక, ప్రాతవనిపాఱవెట్టక, వానిశృంఖలముల జిక్కుకొనక, సమయోచితముగ నుపయోగించుచు స్వతంత్రజీవితసూత్రముల నేర్పరచగలిగియుండిరి. ఇందుచే వీరు ప్రాచీన నవీన మర్యాదావలంబకులగు నాంధ్రభాషాసేవకు లందరివిశ్వాసమునకు గుర్వైరి. వీరి యౌదార్యము, బాలకవులయెడజూపెడి వాత్సల్యప్రోత్సాహములు, **మాటల** సొబగు, స్నేహధర్మములు వీరిప్రతిభ నెల్లెడల జాటినవి.

శ్లో॥ కేచిత్ శ్రీపతి వేంకటేశ్వరకవి దృష్ట్వాథ శుశ్రూషయా ।
కేచిత్ కేవలమిత్రతా ముపగతాః కేచిత్పరిత్యాంతికే ।
అభ్యస్యంతి శతావధానకలనాం కీర్తిం లభంతే ధనం ।
తస్మాదాంధ్రభువి శతావధానిగురుతాహేతూ గురూ సంశ్రయే ॥

వీరియుత్సాహప్రోత్సాహ తన్మయత్వముల కాంతిచే నెందరో భాషాసేవకులై సరసకావ్యముల గూర్పగలిగిరి. తిరుపతివేంకటేశ్వరులు గుణగ్రాహులు, పరాభిప్రాయమును సహించువారలు, వినయసంపన్నులు. పెద్దబింకములవారెఱుగక నందరితో కలసిమెలసి సంచరించు నిండుకుండలు. అయినను వలసినచో వెట్టిమొత్తి బడాయిల నణగద్రొక్క వలసినచో, పండితవాదప్రహారముల నెదుర్కొనవలయుచో, వీరి మానస మొప్పుండెను.

శా॥ " మాకె [illegible] మాననీయులైనకవు లీయుష్మన్మండలి లేకపో
రికాలంబున యుష్మదీయ కవితాద్వీపంబు ముంపంగ న

ఖ్యాతశ్రీకమదీయదివ్యకవితాతుంగార్భటీఘోరగం
గాకల్లోలవతీప్రవాహాభరవేగప్రక్రియత్ చాలవే " ||

తాము స్వతంత్రించి బూనిన నూత్నకవితామార్గముల నిలచి నిలుపగల యహంకారము, పూనిక, ఉత్సాహము నైజసత్త్వమున దీపింప, తిరుపతివెంకటేశ్వరులు నవీనాంధ్రకవితాపురోగాములై విలసిల్లిరి.

తిరుపతికవులు తెలుగుకవిత్వమును ప్రభుపోషణమునుండి తప్పించి, ప్రజాపోషణమున జేర్చి, కవులస్వాతంత్ర్యమును, కావ్యముల పరమైశ్వర్యవిభూతిని నెలకొలిపియున్నారు. రాజులదర్శించి, సంపన్నులజూచి " సన్మానములంది బహుమానములన్ గ్రహియించిరేగాని " కావ్యలక్ష్మీవిలాసముల నరస్తవమున కుపయోగింపలేదు. నానారాజసందర్శనమునందగుపడు చర్యలన్నియు, జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః। నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయం " అను నార్యోక్తిజాటుచు, " ధరణీశులు మ్రొక్కగనిక్కినా " మను నిర్లక్ష్యమానస స్వాతంత్ర్యమును సూచించుచుండును. అంతకుమున్ను రాజాశ్రితులగు తెలుగుకవులు తామల్లినస్తోత్రముల రేడుల కందించు వేడుకం బెద్దప్రొద్దులోపికతో రేనిచూపులగాచియుండ, తిరుపతివేంకటేశ్వరులు విజయనగరమున, నభినవభోజుడోయన సరసగుణసాంద్రుడై, సకలకళాసంపన్నుడై, కవికల్పవల్లియై వెలుగొందు ఆనందగజపతీంద్రునిగనుంగొని " ఎందరిజూచెనేని వరియింపదు మాకవితాకుమారి......తటాలున దీని వరిగ్రహింపుమా " యని హెచ్చరించి, వసుమతీశులుకూడ కావ్యసామ్రాజ్యవైభవంబుల పరమౌత్కృష్ట్యమును అంగీకరింపవలయుగౌరవ మేర్పరచిరి.

తిరుపతికవులు కావ్యసాధనమే మోక్షసాధనమని విశ్వసించి, నిర్మలవిశుద్ధరసానుభవమున నుత్తమగతుల జెంద నుద్యోగింతురు.

శ్రోత్రియమగు జీవనముకాని, వైదికాచార సంపత్తులుకాని, దేవతోపాసనకాని, పరతత్త్వమును, పురాణగాథలను పనివని బేర్కొనుట కాని, కవుల నిత్యసాధనగ వీ రంగీకరింపరు. "శృంఖలాత్మనీకరణమందు" కావ్యకలవానుకూలమగు మానసమే, రసాత్మకమగు సీశ్వరోపాసనయే మోక్షకారణమగునని జెప్పియున్నారు. ఇందువలన తిరుపతికవుల కుపాసితదేవి లేదనరాదు. వెంకటశాస్త్రి సహజ గాంభీర్యముతో, "అస్మదుపాస్య, అమ్మహోదారచరిత్ర యియ్యెడల దారచియింపకపోదు సాయమున్" అని నిత్యము నమ్ముచుండెను. తిరుపతిసింగపు హృదయాంతరాళము, భీముని మానసమువలె, కోమల వినయ లాలిత్యమొప్పుచు "హేయంబైన సభాపరాభవము రానీకమ్మ కాత్యాయనీ," యంచు జాలిపలుకుల నమ్మను గొలుచుచుండెను. గురుజనంబులగూర్చి వీరి కపరిమిత విశ్వాసముండెను. ఈ కృతజ్ఞతయే వీరి భక్తవర్గమును గూర్చగలిగినది. "వాసింగన్న కవీశ్వరుండయిన, నెవ్వాడైన" గురుద్రోహ మొనరింప గూడదనియే వీరి యభిమతము. ప్రాచీన హైందవాచారములనట్లు సహేతుకమైన యభిమానముంచి నిలవదీయుచు, పాశ్చాత్య సంపర్కమున నేర్పడిన సంఘసంస్కారణాభిలాషను నిగ్రహించుచు, జాతీయ ధర్మప్రతిష్ఠాపనలందు మాన్యత నేర్పరచు చుండిరి.

తిరుపతికవులు ఖండకావ్యములకు దారి జూపిరి. భారత భాగవతాది మహాపురాణముల రచించుటకు వలయు లోకానుగ్రహదీక్షయు, తపస్సంపత్తియు, రససిద్ధియు తిక్కన పోతనాదుల కొప్పియుండెను. ఆంధ్రకవితా పితామహుని మనుచరిత్ర యేర్పడు కాలమునకే తెలుగుకవులపస కొంత చెడినదని జెప్పవచ్చును. పెద్దన మూడాశ్వాసముల బూరించినంతనే కావ్యవైఖరి మారినది. తరువాతి కావ్యకర్తలు ప్రబంధములలో నష్టాదశ వర్ణనల నింపి, కావ్యమును

ఖండచిత్రముల సంపుటముగ నొనర్చిరి. ఇవియు చేమకూరివాని యనంతరము రసరూప సౌందర్యముల వీడినవి. సామర్థ్యమెట్లున్నను తిరుపతి కవులకు ముందు పేరొందిన వీరేశలింగ కవిగూడ, "శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచన నైషధము" రచియించెను. తిరుపతికవుల యవధానకవిత్వమును జనరంజకముగ నొనర్చి, సులువగు సరసముగు, లక్షణసహితముగు భాషలో నను స్తవిషయములను, నానాసందర్భములను, సుబోధకముగ ముద్దులొలుక బలుకుచుండిరి. అవధానములందును ప్రస్తావనలందును వీరు వచించిన కావ్యవైఖరులు ఆశుకవిత్వ సారళ్య మొప్పియు, నందచందముల తొల్లిటి మేటికవుల కల్పనలకు వెనుదీయక తెలుగుపద్యముల నతిశీఘ్రముగ నతిలాఘవముగ నల్లుతెరవుల గల్పించెను. తిరుపతి వేంకటేశ్వరుల మానస ప్రభావమున సర్వజనాంగీకారమంది మాన్యతవహించిన యవధాన కవిత్వము, ఇతివృత్తమందును భాషాప్రయోగమందును, విషయ స్వాతంత్ర్యమందును ఖండకావ్యముల మూలమై, నవ్యాంధ్రకవితా ప్రసంగతికి యూరని బిచ్చుమిడిన దాయెను. వాడుక తెలుగు నెంతయు మనోహరముగ నుపయోగించి యల్పసంస్కారులగు బాలకవులపాలిటి దైవమై, తారకమంత్ర ముపదేశించిన ప్రౌఢ లీతిరుపతి కవులు.

ఉ॥ "వేసని దగ్గరాయె మిము • వీడుటకున్ మనసొగ్గదాయె మా
వాసము దూరమాయె పర • వాస మదెట్టులొ భారమాయె మా
కోసము తల్లిదండ్రు లది • గో ఇదిగో యని చూచుటాయె వి
శ్వాసమెలర్పగా నెలవొ • సంగిన బోయెద మయ్య భూవరా"॥

అను పద్యములందును కామేశ్వరీ శతకమందును, శనిగ్రహ మందును, అవధాన ప్రస్తావన కల్పనలందును తిరుపతి వేంకటేశ్వరులు బింకాన నడచిన ముద్దుపోకడ లాధుని కాంధ్రకవితావిర్భావమహారంభమున కాధారములైనవి. ప్రస్తావనలో వీరి సమయస్ఫూర్తి తిరుపతి

శాస్త్రి కాకినాడ రైలునిలయమున నుండగా శృంగభంగమును బ్రచు రించినవార్త విని, యచ్చెరువంది చెప్పిన పద్యరాజమే వేనోళ్ళ జాటుచున్నది.

ఉ॥ చుక్కలు రాలలేదు రవి ♦ సోములపోకడ మారలేదు న
ల్దిక్కులు కూలలేదు జల ♦ ధిజ్వాలనం బుబుకంగ లేదు నే
డక్కట రామకృష్ణకవు ♦ లర్భకు లేగతి జేయ నేర్తు రా
ధిక్కృతవైరి వేంకట సు ♦ ధీశ్వరవాలికి శృంగభంగముల్ ॥

తిరుపతికవుల చేతకైతలు, నవ్యవైఖరుల దెలుప వేంకటశాస్త్రి మందస్మితావలోకన కళాసంపర్కమున నాంధ్రిభాషామాధుర్య మని వార్యమోహపాశముల వెదజల్ల నెందరో అవధానులై, నాటక కర్తలై, కావ్యకళనా వైదుష్యమును సంపాదించియున్నారు.

తిరుపతికవు లాంధ్రిగీర్వాణ భాషాలక్షణములం దసమాన పాండిత్యమున నొప్పుచున్నను, సుప్రయోగదక్షు లయ్యును, పూర్వ కవుల గుట్టుముట్టుల నెరిగి యీగతి వచించిరి.

క॥ వ్యాకరణ మొక్కత్రోవ మహాకవు లొక త్రోవ కోశ మఖిల మ్మొకత్రో, వైకనుపట్టెడి నీ భాషాకావ్యమ్ములను దలచు చదివిన వాలందెర్." "తెలుగునకున్న వ్యాకరణదీపము చిన్నది భారతాదులలో యతిభ్రంశాది దోషములుగలవి యొకదోషముకాదు. భారతాదుల లేనిపదములు ననికలవె ? అందుచే నిది గ్రామ్యమనియు, దేశ్య మనియు పెనగశక్యంబె ?" మున్నగువాక్యములతో తమకావ్యనియ మముల బేర్కొనియున్నారు. వాడుకపదములను సందర్భోచితముగ నందముగ వాడి తమకావ్యముల కసమానజీవకళలను గూర్చియిచ్చిరి. "కూటికి గుడ్డకై పరులకొంపకు జేరి"—ఎంత బాగుంది ?—పద్య మల్లుటలో వీరివృత్తములు సైతము షేక్సిపియర్ గీతముల వైఖరిలో సరళముగ భావానుకూలమగు సంభాషణారీతుల గద్యమువలె రస

స్ఫురితములై దుముకుచుండును. వ్యాకరణ లక్షణముల బాటింపక వాడుక తెలుగుపోకడల రసవత్పద్యరత్నముల జూపుటయేగాక, గద్య పద్ధతుల సమీపించు పద్యవైఖరుల నేర్పరచి, భావి కావ్యారంభము లకు దారి జూపిరి. దేవీభాగవతములో దేవపురోహితుడు చంద్రుని వాకిట నిలబడి యరచినయర పెంతగద్యసైజ మొప్పుచున్నదో చూడుడు !

ఉ॥ ఔర ! దురాత్మ యెంతటి దురాచరణం బొడగట్టినావురా !
దారనుజూడనేగునను ద్వారమునందొకఁడాగువాఁడె ? నా
నీరజనేత్ర నాయతివ నీకు స్వతంత్రమె ? నాకుదూరమే ? ”

ఇట్లులే భారత నాటకములందు పలుతావుల గద్యవైఖరు లంద మైన పద్దెముల గన్పట్టుచున్నవి. “ పెండిలియాడినఁ బిదపబిడ్డలుపుట్టుట నిశ్చయంబు, నే పెండిలియాడనుకొంటి,”—“సేవాధర్మము సూతధర్మ మును రాశీభూతమై యొప్ప వాచావాత్సల్యముజూపె కర్ణుడిటు మాత్సర్యంబు మీకేల ? ” “అంచితులైన బందుగుల అందరిముందర జెప్పి నిన్ను మెచ్చించెద, కుంతిచేత రవిచేతనిజంబని నీకు సాక్ష్యమిప్పించెద, ఫల్గుణ ప్రముఖ వీరులు గొల్వగనెల్లభూమి యేలించెద.” గద్య వైఖరే కాదు — ఉపన్యాసతీవ్రతయు నిండిమిడియున్నది. పదముల వాడుటలోకూడ స్వాతంత్ర్యమెంతయు ద్యోతకమగుచున్నది. “ ప్రాచీన గురుశిష్యపద్ధతి”లో,

“శా॥ బెంచీలక్కర లేదు గేమ్సుమొదలౌఫీజుల్ విసన్ రావు బొమ్మ్రించున్ నిర్ధను ద్రోచిపుచ్చరు ” మున్నగు నవ్యభాషాపదప్రయోగ ములు, సువిదితమైనవి ప్రయోగింపబడినవి. నవీనాంధ్ర రచయితలలో కొందరు సువిదితమగునవ్య భాషాపదములకు దురవగాహమగునాంధ్ర పదమును గల్పించి వాడెడిదురాచారము నిటుహాకవుల పోకడ ఖండించుచున్నది.

అల్పవిషయముల నందమగుపాడుక తెలుగులో గద్య వైఖరు లొప్పు పద్యములలో రసభావసౌందర్య ముట్టిపడ జిత్రించుటయేగాక, లౌకిక పరిజ్ఞాన మందును, లోకానుభవమందును వీరు మిన్నలై యున్నారు. జార్జి పట్టాభిషేక సమయమున బ్రచురింపబడిన పద్యావళులన్నిటిలో తిరుపతి వెంకటేశ్వరులు సమర్పించ దానియం దాశీర్వచనమునకు తోడు వందివాక్యములకు జోడుగా, రాజకార్యభార ప్రశంసయు, ధర్మవిరోధమున గల్గనోపెడి యధికారభ్రష్టతయు నెంతయో లలితవ్యంగ్యరీతుల దెలుపబడినవి. వీరినాటకములందు ప్రబంధములందు, అవధానప్రస్తావనములందు గోచరించు కథాసందర్భములు, సంభాషణ వైఖరులు, అసమానమగు లౌకికపరిజ్ఞానమును వెల్లడించును. ఉంగరము పోయినప్పుడు వ్రాసినపద్యమెంత నియోగ్యగమర్యాదల దూగుచున్నది ! సరసాలాపవర్ణనమునందునకూడ పూర్వకవిప్రయుక్తమైన వర్ణనల దలమార్చివాడక, స్వకీయానుభవమునుండియే గూర్చుచుందురు.

చ॥ సరసుని వైపు వీపు, అలచాన మొగంబటు గోడవైపు, ఆ
సరసుడు కేలు చాపు, నలచానయు చన్నులమీద మోపు, నా
సరసుడు కోర్కెచూపు, నలచానతొడం దొడలోన దోపు, నీ
వరుసనె తెల్లవారె నొకవైఖరి కొక్కసి కొక్క వేశ్యతోన్ ॥

తిరుపతి వెంకటేశ్వరుల విఖ్యాతకావ్యములందు వారి యనుభవములే, వారి యహంకారపూరిత వాగ్వైభవములే మిక్కిలి యందముగ దోచుచున్నవి. శ్రవణానందము, పాణిగృహీత, గీరతము, వారి యనుభవసారమును దెల్పుచు నహంకారోద్రేక భరితములై యున్నవి. స్వానుభవములను చిత్రించుటలో, నహంకారమును పద్యనాళములు బ్రవహింప జేయుటలో, సామాన్యులు హేయముగ రసవిహీనముగ, మాత్సర్య గర్వపూరితముగ

జేయుచునారే కాని, సరసరీతుల పదనిగ్రహములో వెలువరింప జాలరు. తిరుపతికవులీపని యవలీల నొనర్చిరి. "ఎవ్వారిని లక్ష్య పెట్టక యవారణ దిగ్విజయం బొనర్చి ప్రజ్ఞాసిద్ధులంచు పేరుగొనినార" మను వాక్యములోని నిజప్రతిభాభివర్ణనమందలి దోషములెల్ల "నీవల నన్ సరస్వతి" యని భారతీగుణ ఘోషణమునకై వినియోగించిరి. గీరతము తొలకిన వారిభావము లెట్టున్నను, అందలి యహంకృతులెల్ల సద్ధర్మనిర్వాహణార్థమై, లోకహితైక కాంక్షతో నుద్దీపితమైన వాస్తవము చదువరులకెల్ల స్ఫురించును. గీరతకవిత్వము నవీనాంధ్రకావ్య సంకల్పములలోనెల్ల నుత్తమమైనది. మానసకోశమున మొలగుచు, రసభావ పదప్రయోగమై దాష్యమున దురాచారముల ఖండించు సారస్వత మహారథుల సమరార్భాటము లీగీరతమున కావ్యవిస్తరత నొందియున్నవి. శ్రవణానందమున, యౌవనవసంత సమాగమమున పులకరించి మొగ్గ దొడిగిన, కోమల భావకుసుమంబులు, సుధామాధుర్య మిగాలుచు సౌందర్యాసుకై తెలుగుకవనముల జెన్నొందియున్నవి. రవీంద్రుడు విజ్ఞానకోశమున జన్మించు దేవ్యాపాసి; తిరుపతి వెంకటేశ్వరులు మానసరంగమున స్వానుభవముల నహంకారచోదితులై నిరాఘాటముగ, నిశ్శంకముగ, ఘంటాపథముగ ప్రమోయించు కావ్యకర్తలు. వంగీయాధునిక మహాకవి సంశయములపోగు; తానెరుగని దాని జెప్పజూచెడి వాడు. తెలుగుకైతల కొత్తముగలు నిశ్శంకముగ, స్వతంత్రించి, మానస వ్యాపారముల నుద్బోధింపగల యాంధ్రస్వభావ విరాజితులు. తిరుపతికవులు రసభావముల మానసికవిమర్శకులే కాని యాధ్యాత్మ తత్త్వవిజ్ఞాతలు కారు.

తిరుపతి వెంకటేశ్వరులు రచించిన ఇతర కావ్యములు బుద్ధ చరిత్ర మొదలగునవి, తమ స్వానుభవోద్దీపకంబులగు శ్రవణానంద

గీరతములకు జంకిపోవుచున్నవి. కాని భారత నాటకములందు వీరు దేశమున కత్యంతోపకార మొనర్చిరి. వ్యాసున కందరాని మెఱుపులను భారతకవులు చూపియున్నారు. వీరినిమించి తిరుపతికవులు నాటకముల గూర్చినారు. ఈనాటకములలో కొన్ని తావుల పేలపిండి కవిత్వమున్నను, అనవసరముగ పద్యము లనేకములు జేర్చినను, మంచిపట్టుల దివ్యమైన పద్యములు, రసస్ఫూర్తి, కథావిన్యాసము గన్పట్టుచున్నవి. వీరు భారతములోను ఆంధ్రగీర్వాణములలో గూలంకషముగ జదివి, వివాదాంశముల జక్కగ బరిశీలించి, మానసపరిచారవై దువ్యమున పాత్రపోషణ మతినిపుణత నిర్వహించిరి. భారత నాటకములు వెలువడు కాలమున మన తెలుగుదేశములో దేశీయభావ ముదయించుచుండెను. రసపుత్రవీరుల గాథలు, శివాజీమున్నగువారి చరిత్రములు, ఓరుగల్లు విద్యానగరముల వీరప్రతాపములు, తెలుగుచదువరులడెంద మానంద పరుచుచుండెను. అట్టి సందర్భములలో తిరుపతికవులు భారతవీరుల విచిత్ర చరిత్రముల సర్వజనామోదమగు నాటకములుగ జేసి దేశాభ్యుదయమునకు దోడ్పడిరి. వీరు కొన్ని భారతపాత్రలపట్ల నదివరకు దేశమందుండిన యపోహల రూపుమాపి, వారి నామములకు శాశ్వతకీర్తినొనగూర్చిరి. వేణీ సంహారము మున్నగు నాటకములవలన న్యాయమార్గమెరుగని కర్ణ్ణుత్రయంబను వదంతి మిగుల వ్యాపించి యుండెను. తిరుపతికవులు కర్ణునిచారిత్రమును చర్యలను సహేతుకముగ, న్యాయ్యముగ పోషించి, యీమహాత్ముని కీర్తిబింబమును నిష్కళంకముగ నొనగూర్చియున్నారు.

కావ్యనాటకములందు తిరుపతికవు లెట్టిమహనీయ సిద్ధినొందిరో, గద్యవిమర్శనమందును, వాదప్రకారము లందును అట్టిచక్కని సిద్ధియే పొందియున్నారు. గుంటూరుసీమ, గీరతములందు గోచరించు వ్యవహార

చతుత చిరాభ్యస్తన్యాయవాదులగూడ సంతృప్తి పరచుచున్నది. వీరికృతులలో నీశ్వరప్రశంస మిక్కుటముగ, భక్తిపారవశ్యమున గోచరించదు. వీరు లౌకికులు, భాషాసంస్కర్తలు, స్వతంత్రకావ్య నిర్మాతలు, స్వానుభవాహంకార నిరూపకులు, రసికాగ్రగణ్యులు. అంతియే కాని, శాశ్వతలక్షణములు వీరికావ్యములం దెంతవరకున్నవో ప్రస్తుత మూహించజాలము. ఏమైనను శ్రవణానందములోని కొన్నిపట్టులు, మిగిలిన గ్రంథములన్నిటిలోని సుభాషితములు తెలుగువారల గౌరవమందుచు చిరస్మరణీయములై నిలచియుండుననుటకు సంశయము లేదు. భాషాభివృద్ధికిని, యాధునికాంధ్ర సారస్వత వ్యాప్తికిని వీరేశలింగ మొకవంకను, తిరుపతికవు లొకవంకను దోడ్పడి, సూత్రధారులై మెలగిరనుటకు సందియముండదు. ఆంధ్రసారస్వతచరిత్రములో వీరెల్లపుడు నవీనయుగారంభకులుగ గౌరవింపబడుదురు. కావ్యనిర్మాతలుగ భావిసంతతు లెట్టి గౌరవ మాపాదింతురో కాలగర్భితమై తెలియకున్నది.

తిరుపతికవుల భాషాసేవ మరపుదగిలినను, వారి కావ్యములు ప్రాచీనశ్లోకవమములై యుపకరింపకున్నను, వారినిత్యచారిత్రము వారి నిరాఘాటప్రచారము, వారిగాథలు, వారిసుగుణములు తెలుగువారిచే నెల్లపుడు స్మరింపబడునని నానమ్మకము. భోజరాజువలె, ఆనందగజపతివలె, కృష్ణదేవరాయునివలె, వీరును తమకథలచే మెప్పించుచుందురు. తిరుపతికవుల నిర్దుష్టలక్షణపరిజ్ఞానమునకన్న స్వతంత్రభాషాప్రయోగ వైదుష్యమెక్కువ వాసికెక్కినది. వారికావ్యసిద్ధికన్న మహోదార జీవితచారిత్ర మెక్కువ గౌరవింపబడుచున్నది. దిగ్విజయములు, అవధానములు, వాదప్రచారములు, సరసప్రబంధరచనలు, మృదుగంభీర హాస్యోపన్యాసములకన్న తిరుపతి వెంకటేశ్వరుల లలితమర్యాదలు

మిన్నలై నిలిచియున్నవి. పండితసంస్కర్త, రసప్రవక్త, తన వైదుష్యముచేతన్న, కావ్యవిజయములచేతన్న, తన నిత్యాలాప సౌకర్యమాధుర్యమున కాలప్రవాహమున నిలువగలిగియున్నాడు, అనుట కీ తిరుపతికవులే నిదర్శనములై యాచంద్రతారార్కమగు కీర్తి ననుభవింతురు.



## శృంగగిరి పీఠాధిపతుల యౌదార్యము.

స్వధర్మప్రకాశినీపత్రికాధిపతులగు కనుపర్తి మార్కండేయ శర్మగారు సనాతనమతస్థులగు గృహస్థుల కుపయోగించు గ్రంథము లనేకము ప్రకటించుచుండుట యందఱికిని విశదము. అందు విష్ణ్వష్టకమను గ్రంథము శృంగగిరి పీఠాధిపతులకుఁ బంపఁగా దాని యుపయోగము కనిపెట్టి శ్రీ శర్మగారికి 200 రూపాల బహుమానము నంపిరట. ఇట్టిమతగ్రంథ ముద్రాపకులకు మఠాధిపతులు ముఖ్యముగా సహాయము చేయవలసినదే కదా! వారిధర్మము వారు నిర్వహించినందుల కెంతయు నభినందించుచున్నారము.

సంపాదకుఁడు.



ష్యామి దృష్టం హ్యేతత్సనాతనం॥ భ్రాతుఃపుత్రా న్ప్రదాస్యామి మిత్రా వరుణయోస్సమాన్ వ్రతంచరేతాం తేదేవ్యో నిర్దిష్టమిహాయన్మయా॥ సంవత్సరం యథాన్యాయం తతశ్శుద్ధే భవిష్యతః। నహిమామవ్రతోపేతా ఉపేయాతాం కదంచనా॥ సత్యవత్యువాచ॥ సద్యోయథాప్రపద్యేత దేవీ గర్భం తథాకురు। అరాజకేషు రాష్ట్రేషు ప్రజాఽనాథావినశ్యతి నశ్యంతిచ క్రియాస్సర్వా నాస్తివృష్టి ర్నదేవతా॥ వ్యాసఉవాచ॥ యదిపుత్రఃప్రదాతవ్యో మయా భ్రాతు రకాలికః విరూపతాం మే సహేతాం తయోరేతత్పరంవ్రతం॥ యదిమే సహతే గంధం రూపం వేషం తథావపుః అద్యైవగర్భం కౌసల్యా విశిష్టంప్రతిపద్యతాం॥ ఇత్యాది...అనంతర మొకరాజభార్య నిమీలితనేత్రయై కలసికొనినందున వ్యాసమహర్షి శ్లో॥ కింతుమాతు స్స వైగుణ్యా దంధఏవభవిష్యతి అని చెప్పెను. రెండవరాజభార్య వెలవెలఁబోయికలసికొనినందున శ్లో॥ వ్యాసస్సత్యవతీపుత్ర ఇదంవచనమబ్రవీత్। యస్మాత్పాండుత్వ మాపన్నా విరూపం ప్రేక్ష్యమామిహా।తస్మాదేష సుత స్తేవై పాండురేవభవిష్యతి॥ అని రెండవకుమారుఁడు పాండువర్ణుఁడగునని చెప్పెను. కనుక ధృతరాష్ట్రపాండురాజుల దేహవైగుణ్యములకు మాతృదోషములు కారణము కాని వ్యాసమహర్షి వైగుణ్యము హేతువుకాదు. వ్యాసమహర్షి రూపము శ్రీరామునిరూపమువలె నీలమేఘశ్యామలమనియు విద్యుత్సదృశజటాభారమండితమనియు వర్ణింపఁబడినది. ఉ॥ ప్రాంశుపయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండధారుఁ బింగాంశుసటాచ్ఛటాభరణు,నాగమపుంజపదార్థతత్వనిస్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీవంశవివర్ధనున్ ద్విదశవందితు సాత్యవతేయుఁగొల్చెదన్॥ అని పోతరాజ మహాకవి వర్ణించియున్నాఁడు. ఇంక ననేకస్థలములలో వ్యాసమహర్షి రూపము రమణీయముగనే వర్ణింపఁబడినది. గ్రంథవిస్తరభీతిచే వదలితి. వ్యాసమహర్షి పరాశరునివలన సత్యవతియం దవతరించి

నందున నిషాదవ్యాసుఁడని నిందించుట యన్యాయము. శ్రీరాముఁడు క్షత్రియుఁడని బ్రాహ్మణులు పూజింపకుందురా? మత్స్యకూర్మవరాహాద్యవతారములు తిర్యగ్జంతువు లనవచ్చునా? సామాన్యశాస్త్రములకు భగవదవతారములందు సంకోచము చెప్పకతీరదు. శ్లో॥ తతస్సప్తదశేజాత స్సత్యవత్యాం పరాశరాత్। చక్రే వేదతరోశ్శాఖాః పుంసోదృష్ట్వాల్పమేధసః॥ సత్యవతియందుఁ బరాశరునివలనఁగలిగి వేదవిభాగము చేసిన వ్యాసమహర్షి శ్రీమహావిష్ణుని యవతారములలో రామకృష్ణాద్యవతారములతో సమముగాఁ బదియేడవయవతారమని శ్రీభాగవతమున వర్ణింపఁబడినది. ఇదిగాక పరాశరమహర్షి లోకాతీతమహిమగలవాఁడు, సంతానార్థము క్షత్రియకన్యకనుఁ బరిగ్రహించినను దనకుమారునకు బ్రాహ్మణత్వమిచ్చుటకును సత్యవతికిఁ గన్యాత్వమిచ్చుటకును సమర్థుఁడు. మహర్షులు తపఃప్రభావముచే సృష్టిచేయఁదగినశక్తిగలవారనుటకు విశ్వామిత్రాదిచరితములే సాక్షి. వెనుకటియుగములందుక్షత్రియస్త్రీలయందు బ్రాహ్మణులవలనఁ గలిగినవారలు బీజప్రాధాన్యముచే బ్రాహ్మణులై యుండుటకుఁ బరశురామాదులు సాక్షులు. శ్లో॥ నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తించ తత్పుత్ర పరాశరంచ; వ్యాసం శుకం గౌడపదం మహాన్తం గోవిందయోగీన్ద్ర మథాస్యశిష్యం శ్రీశంకరాచార్యం॥ అని నానాదేశస్థులగు బ్రాహ్మణులు గురుకోటులోఁ బరాశరసుతుఁడగు వ్యాసమహర్షిని బఠించుచున్నారు. శ్లో॥ కృష్ణద్వైపాయనం సాక్షా ద్విద్ధి నారాయణంపరం। కోహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృద్భవేత్॥ అనుపురాణవచనము మహాభారతకర్తయగు కృష్ణద్వైపాయనుఁడు నారాయణావతారమని చెప్పుచున్నది. శ్రీభాగవతప్రథమస్కంధము, అధ్యాయము ౪ శ్లో॥ ద్వాపరేసమనుప్రాప్తే తృతీయే యుగపర్యయే। జాతఃపరాశరాద్యోగీ వాసవ్యాం కలయాహరేః॥ చాతుర్హోత్రం కర్మశుద్ధం ప్రజానాం వీక్ష్య వైదికం వ్యదధా

ద్వ్యజ్ఞసంతత్యై వేదమేకం చతుర్విధం॥ ఋగ్యజుస్సామాథర్వాఖ్యా వేదాశ్చత్వార ఉద్ధృతాః ఇతిహాసః పురాణంచ పంచమోవేద ఉచ్యతే॥ తత్రర్గ్వేదధరః పైల స్సామగో జైమినిఃకవిః వైశంపాయన ఏవైకో నిష్ణాతో యజుషాంగణే। అథర్వాంగిరసామాసీ త్సుమంతు ర్దారుణోమునిః॥ ఈవచనములయందు సత్యవతీపరాశరుల పుత్రుఁడగు వ్యాసమహర్షియే వేదవిభాగకర్తయనియుఁ పైలవైశంపాయనజైమిని సుమంతు లాయనశిష్యులనియు వర్ణింపఁబడినది.

కల్పాన్తరములందును వ్యాసులుకలరు. ఈద్వాపరమున వేద విభాగముచేసినది యీవ్యాసులనుటయే నిశ్చయము. బ్రహ్మసూత్రరచయితయు నీమహర్షియే. నిజ మిటులుండఁగా వేదవిభాగకర్త యీవ్యాసమహర్షి కాఁడనుట యవిచారమూలకము. వ్యాసమహర్షి కామపీడితుఁడై విచిత్రవీర్యపత్నులఁ గలియలేదు. మాత్రాజ్ఞావశమున నష్టవంశోద్ధరణార్థము నియోగవిధిచే సంతానము కలుగఁజేసెను. "కృతేతుమానవాధర్మాః" అను పరాశరస్మృతివచనప్రకారము నియోగవిధి కృతయుగమునాఁటినుండియుఁ గలదు. కనుకనే మనుస్మృతి యందు వర్ణింపఁబడెను. మధ్యకాలమునధర్మశాస్త్రములలోనికి దశవిధ సంతానములనెక్కించిరనుట ధర్మవిరుద్ధము. శ్రీభాగవతప్రథమస్కంధమున, శ్లో॥ భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థః ప్రకాశితః। అని భారతము సకలవేదార్థప్రకాశకమని చెప్పఁబడియున్నది. భారతము పురుషార్థచతుష్టయప్రతిపాదకము. కేవలము భగవన్మహిమ వర్ణనప్రధానము కాదు. కనుకనట్టిస్వతంత్రగ్రంథమును రచియించేకపోయితిని. ఆవిధముగాఁగూడ లోకోపకారముచేసిన బాగుండునని యామహర్షి చింతించెఁగాని భారత మసచ్చరిత్రము. అట్టిదానిరచించితినని చింతించ లేదు. భారతము విస్తృతగ్రంథమగుటచే నిత్యపారాయణముచేయు సంప్రదాయము లేకపోయినను నియమముగాఁ గథాశ్రవణముచేయు

టయుఁ బ్రీతిపర్వమునకు సమారాధనాదికము చేయుటయు సకల శిష్టజనసంప్రతిపన్నము. వ్యాసమహర్షి చింతించినసంగతి భాగవతప్రథమస్కంధ పంచమాధ్యాయమున స్పష్టమగును. శ్లో॥ జిజ్ఞాసితం సుసంపన్న మపి తే మహదద్భుతం। కృతవాన్ భారతం యస్త్వం సర్వార్థపరిబృంహితం। జిజ్ఞాసిత మధీతంచ బ్రహ్మయత్తత్సనాతనం। తథాపి శోచస్యాత్మాన మకృతార్థఇవప్రభో॥ సకలపురుషార్థప్రదమగుచు నాశ్చర్యకరమగు భారతము రచించితివి. వేదాధ్యయనము చేసితివి. బ్రహ్మమీమాంసాశాస్త్రము రచించితివి. ఐనను ఖేదముగలవానివలెఁ గనఁబడుచున్నావు. ఇందుకుఁగారణమేమి? అని నారదమహర్షి వ్యాసమహర్షిని ప్రశ్న చేసెను. అందుకు వ్యాసమహర్షి తన యసంతోషహేతువు తనకుఁ దెలియదని చెప్పఁగా నారదమహర్షి. శ్లో॥ భవతానుదితప్రాయం యశోభగవతోమలం। యేనైవాసౌ నతుష్యేత్తు మన్యేతద్దర్శనంఖిలం॥ యథాధర్మాదయశ్చార్థా మునివర్యానువర్ణితాః। నతథా వాసుదేవస్య మహిమా హ్యనువర్ణితః॥ భారతమందు ధర్మార్థకామములు నిరూపింపఁబడినంత భగవన్మహిమ నిరూపింపఁబడలేదు. ఏగ్రంథముచే భగవంతుఁడు సంతోషింపఁడో యాగ్రంథము వ్యర్థము. నీవు భగవద్భక్తినిరూపకమగు గ్రంథమును రచింపుమని చెప్పెను. ఇదియు భారతము పవిత్రగ్రంథముకాదనుటకుఁ జెప్పఁబడియుండలేదు. భారతప్రాశస్త్యము నారదమహర్షియే యంగీకరించియుండెను. "నహినిందా నిందితుం ప్రవృత్తా. అపితు స్తవ్యం స్తోతుం" అను మీమాంసాన్యాయప్రకారము ప్రస్తుతము శ్లాఘింపఁబడు భాగవతముత్తమమని చెప్పుటకై భారతరచనానంతర మసంతోషము వర్ణింపఁబడినదిగాని భారత మప్రశస్తమగుటచేఁగాదు. భారతములోని భగవద్గీతలకును మోక్షధర్మములకును మించిన తత్త్వశాస్త్ర మెందును లేదు. ఈసంగతి పండితులకుఁ దెలియనిదికాదు. పరీక్షిన్నరేంద్రుని

కావున వారివాక్యములే పరిగ్రాహ్యములు. తదభిప్రాయానుసారముగా మనమనిపాటలచ్చియు నెఱవేర్చి పంటలు పండించి పరిపాలించెడి నిమ్నజాతుల నభివృద్ధి బెట్టికొనకయుండ దప్పదు. తదనుగుణముగాఁ బాయమాపన్నులనుండి బహిష్కృతులై ప్రాణములఁదక్కించెడు శకృన్మూత్రములు సహ్యించకయుండ దప్పదు. నిమ్నజాత్యుద్ధరణ సంఘము వారు ప్రయత్నించి యంగీకృతమైన కరపత్రము పరిశీలించుటకింతకన్న నెక్కువ యమానుష్యనిబంధనలకేమియు విచారమయ్యెడిని. ప్రమాణసిద్ధములైన భాషితములను బ్రమాణాంతర ప్రదర్శనముచేఁ బరిశీలించుటకుఁ బక్షపాతులున్నను గాని కామచారవాక్యముల కేమిదారిగలదు ?

శ్లో॥ వేదాః ప్రమాణం స్మృతయః ప్రమాణం ధర్మార్థయుక్తం వచనం ప్రమాణం। యస్య ప్రమాణం నభవేత్ప్రమాణం కస్తస్య కుర్యాద్వచనం ప్రమాణం॥ వేదములు ప్రమాణములు. స్మృతులు ప్రమాణములు. ధర్మార్థయుక్తమైన తదజ్ఞాయుక్తి ప్రమాణము- ఎవనికిఁబ్రమాణముప్రమాణముకాదో వానివాక్యమెవఁడు ప్రమాణముగా భావించును?

శ్లో॥ అవైదికాని వాక్యాని బౌద్ధాదిపతితానిచ। విప్రలంభకవాక్యాని తాని సర్వాణి వర్జయేత్ ॥ అను చతుర్వింశతిమతోక్తి ననుసరించి చార్వాక బౌద్ధాదివాక్యముల వర్జించుటయే ప్రకృతకర్తవ్యము.

శ్లో॥ తం తాపిహితనాచారిత్రా యస్సాఽభిప్రాయమాశ్రితః। శాస్త్రాతిగ స్సతోమూర్ఖో ధర్మతంత్రోపరోధనాత్ ॥ అను బోధాయనోక్తిప్రకారము శాస్త్రాతిగులై స్వాభిప్రాయముల నాశ్రయించి యుండెడివారిని మూర్ఖగణములోఁ జేర్చుకొని యూరకుండవలయును. గీతలలోని రహస్యములను దెలిసి గ్రంథములు వ్రాసినవారును గారాగారమునకుఁ బోయి [illegible] కూడ [illegible] భగవద్గీతల వీడనివారును నుపరితనశ్లోకోక్తి [illegible] యపరిమిత సంతాపకరము.

శ్లో॥ యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః। న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిం।తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ ॥ అనునీవాక్య మాగీతలలోనిదే. శాస్త్రవిధిం ద్యజించి స్వేచ్ఛమైవర్తించెడివాఁడు సిద్ధినిగాని సుఖమునుగాని సద్గతినిగాని బొందఁడు. కానఁగార్యాకార్యవ్యవస్థితియందు శాస్త్రము ప్రమాణమని దీనియర్థము. ఈగీతోక్తిని బాగుగాఁ బరిశీలించినఁ బరిత్యక్తశాస్త్రప్రమాణులును గామకారులునునై యున్నంతవఱకుఁ గార్యసిద్ధికలుగదా మనితోఁచకపోవదు. సమ్మజాత్యుద్ధరణసంఘమువారి కరపత్రమును గాంధుపైఁ గలిగినయభిప్రాయమును మార్చుకొనలేక దానికనుగుణమైనధోరణితోనే జవాబిచ్చినందులకుఁ బ్రాజ్ఞులు మన్నింతురుగాక. ఈ యంశము కడులోఁతైనదియగుట నొక్కిమొక్కి వ్రాసినను దూరదృష్టితోనుండవలయు. అట్లుకాక యనేకు లస్పృశ్యతానిర్మూలనమున కాతురపడుచు నపభ్రంశముల వ్రాయఁగడంగిరి. ప్రసిద్ధదేవాలయములలోపలకుఁ బంచములు ప్రవేశించినట్లుకూడఁ బ్రమాణింపఁదొడంగిరి. ఇది మహాత్మునిమతమని యంతయు నాయననెత్తికిఁజుట్ట మొదలిడిరి. ఆయనతత్త్వము వేఱు. అది యతిగహనము. అందఱికిని దుర్భేద్యము.

......నీతియునియమము లేని యంత్యజాత్యుద్ధరణసాంఘికనామధారుల వాగ్వివరంబులనుండి వెడలు నిష్ఠురోక్తుల వినుటకంటె వేఱుపృజినముండమి నెఱింగియు మిమ్మదానికి గురిచేసినందులకు నన్ను మన్నింపుఁడు. రక్షించుటయేమిటో పోషించుటయేమిటో యిత్యాదులే యెఱుంగని పండితంమన్యులభాషితములఁ బరిశీలింపఁబూనిన పాపాత్ముఁడు పశ్చాత్తాపపరిశుద్ధుఁ డగుచున్నవాఁడు.



# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౦ | ౭ | పాయశ్చిత్తము | ప్రాయశ్చిత్తము |
| ౧౧ | ౨౯ | బడిదిన | బడినది |
| ౧౨ | ౧౮ | కాపి | కాని |
| ౧౩ | ౮ | వర్షము | వర్గము |
| ౨౮ | ౧౮ | తయస్కార | నయస్కార |
| ౨౫ | ౨౨ | చండాలుడను | చండాలురను |
| ౩౦ | ౧౦ | కనిరుద్ధ | కవిరుద్ధ |
| ౩౧ | ౧౧ | వాఖ్య | వ్యాఖ్య |
| ౩౮ | ౫ | బొందించె | బొందించు |
| ౨౪ | ౪ | శాద్ధ | శ్రాద్ధ |

# పీఠికలోని తప్పొప్పులు

| | | | |
|---|---|---|---|
| ౧౪ | ౪ | వచ్చిన | నచ్చిన |
| ౨౩ | ౨౧ | మట్లు | మట్టు |
| ౩౩ | ౧౪ | దెలయ | దెలియ |
| ౩౮ | ౧౩ | నస్పృతా | నస్పృశ్యతా |
| ౩౭ | ౨౯ | డత | డంత |
| ౪౩ | ౨౪ | వర్జనము | విసర్జనము |

# అంటరానివాళ్లలోని తప్పొప్పులు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| ౫ | ౮ | తదావేశా | తదాదేశా |
| ౬ | ౧౫ | భజంచిరి | భజించిరి |
| ౧౦ | ౮ | లయితే | లయినా |
| ౧౭ | ౨౪ | జూడఁదగిన | జూడందగిన |
| ౧౯ | ౧౧ | బూర్వదేశ | బూర్వదేవ |
| ౨౦ | ౨౩ | ముసకు | మనకు |
| ౨౨ | ౧౭ | విధవాయాం | విధవాయాం |
| ౨౫ | ౬ | జాతము | జూతము |
| ౨౬ | ౪ | హోమము | హోయము |
| ,, | ౨౦ | పీరము | పీఠము |
| ౨౭ | ౧౬ | దేశోద్ధారణ | దేశోద్ధరణ |
| ౩౪ | ౨ | నమదియు | నదియును |



ఉ॥ అయ్యొకిమీఁడు దవ్వరుగునావల భృత్యుఁడు వచ్చి "యెంతసే
పయ్యెడినయ్య రాజుచని" యంచిటు చక్కఁగనిల్చి బాణముల్
చయ్యనఁజేయు నప్పురుషు సంభ్రమ మొప్పఁగఁ బ్రశ్న సేయఁగా
నయ్యపుకారుఁ డిట్లనియె నాతనిఁగూరిచి క్రిందఁజూచుచున్, ౬౩౭

కం॥ "నారాచకర్మసక్తుఁడ, నేరాజును జూచియెఱుఁగ నీదారిఁ జనన్
భారంబగుపనియుండిన వేఱొక్కఁని నడుగు మతఁడు వివరించును దాన్" ౬౩౮

కం॥ అని యీ ప్రకారముగ నా జనపతిసేవకునితోడ శరకారుఁడు నే
వినుచుండఁగ వాకుర్చ్చుటయును నాతనిరీతి కంతెరయును సుబ్రహ్మగాన్ ౬౩౯

కం॥ "ఒకచిత్తముగలుగుటచేఁ బ్రకటితమయ్యెడిని వాని బ్రహ్మజ్ఞానా
త్మికమైనయట్టియోగం బిఁక నొకవిధమున ఘటింప దిది రూఢముగన్ ౬౪౦

కం॥ కావునఁ జిత్తనిరోధము గావించెద బ్రహ్మసిద్ధిగలుగుటకై" యం
చీవిధమున భావించి మనోవీథిం జాలిచితి ఘను జగదూరిపున్, ౬౪౧

సీ॥ పాకారిముఖదేవ పరిపాల్యమానమై తేజరిల్లెడి దశదిశలయందుఁ
గన నెంతసేపటికిని దర్శనంబీక తనరారు తద్దిగంతములయందు
నీరూపమయ్యును నీలవస్తుభ్రాంతి గలిగించు నంతరిక్షంబునందు
గిరిసరిత్పురసరస్సరిదద్రికారణ్య పరివృతంబైన యీ ధరణియందు
నందు నిందననేమిటి కఖిలమందు నాపరాత్పరుఁదప్ప నన్యమును దేని
నేనుజూచుటలేదు, నా కింత తేజమేరుపడుటకు నయ్యదే కారణంబు, ౬౪౨

కం॥ ఈచాడ్పుననయ్యెను నా కాచార్యుఁడు కాండకారుఁ డస్మత్స్వాంతి దా
నేచందము గురువయ్యెనో వాచంయములార! వినుఁడు వక్కాణింతున్, ౬౪౩

తే॥ సర్వసంగపరిత్యాగపూర్వకముగ నెప్డు నిలువెడలితినో నే నప్డు దస్మ
దూఢయును బసిబాలకు నొకరుని నెడబిడ్డనుం గొంచు నావెంటఁ దీర్థితి వెడలి

సీ॥ "స్వాధ్యాయపఠన భిక్షాచర్యముల నెప్డు శ్రీమునులొందెడు బ్రహ్మచారియేని
పుత్త్రకళత్త్రాది పోషణాతురతమై నస్వస్థుఁడైన గృహస్థుఁడేని
కందమూలఫలాశిగం గృశించుచుసదా వనటఁగూరెడి వనవాసియేని
దినమొక్కయూరికిం దిరిగి మాధుకరంబు యాచించుచుండు సన్న్యాసియేని
సంయతాత్ముఁడగుచు సరిగవర్తించుచో ముక్తినొందు నిక్కముగను గావ
వాదుమాటవినుము నాథ! యీగార్హస్థ్య ముద్ధరింపఁగలుగు నోజ నిన్ను, ౬౪౫

ఉ॥ కాదని నం ద్యజించి గొంటొ కాలముపుచ్చఁ దలంచెదేని నే
నేదొవిధిం ద్యజింతుఁ దను, వీ పసిబిడ్డఁడు బిడ్డగూడ నా
మాదిరి మేనువాయుదురు, మంచియొ చెడ్డొ మదీరితంబు నీ
కాదరణీయ, మిందులకు నడ్డువచింపకుమీ కృపావతిన్, ౬౪౬

తే॥ స్వయముగా గుర్తెఱింగియుఁ జనుట తగును యన్యతీర్థంబునకు నాథ! హాటకేశ్వ
రంబు తీర్థంబులం దుత్తమంబటంచు ఋషిసుర తాపసులు చాలఁ జెప్పిరిందు. ౬౪౭

శ్లో॥ "పునంతి సర్వతీర్థాని స్నానదానాదసంశయం
హాటకేశ్వరజం క్షేత్రం స్మరణాదపి పావయేత్" ౬౪౮

ఆ॥ అని యథార్థవాదియైన విశ్వామిత్రు నాననంబునుండి యాలకించి
యేను విప్రకుండ నీశ్లోకమును సదా పఠనసేయుచుందు భక్తితోడ" ౬౪౯

కం॥ అనిచెప్ప సెట్టి కేలకు "వనిత! గృహస్థుఁడను గాను వానప్రస్థుం
డను గాను మనుదు" నని యాఘనమగు తీర్థంబు దరిని గాఁపురముంటిన్, ౬౫౦

కం॥ కరయుగళంబున గాజులు వారువగు చరణాబ్జయుగళి నందెలు కడియాల్
మెఱయఁగ నాడుచుఁ బాడుచుఁ దిరిగెడి నాముద్దుబిడ్డ దినదినమునకున్, ౬౫౧

తే॥ కందమూలాశనంబునఁ గార్శ్యమొందఁగఁ డఁగుటయుఁ జాఱె గాజులు క్రమముగాను
నది కనుంగొనుచుఁ గాలంది నోయార్యులార! కాఱె నాడును బాష్పము ల్కనులవెంట

కం॥ జాఱియు జాఱియు నవ్వి కుమారిక హస్తముల మూఁడు మాత్రము నిలువన్
సారెకుఁ దత్కంకణ ఘర్షణఁ జారుతరంబైన యొక్కశబ్దం బొదవెన్, ౬౫౩

ఆ॥ పెద్దకాలమునకుఁ బిదప నందును రెండు గళితమగుచు సెట్టి ఘర్షణమును
లేక యొకటె మిగిలి నాకంటఁబడుడు నయ్యాశ్రమంబుగూడ నవలఁద్రోసి ౬౫౪

ఆ॥ "పెక్కుమంది కూడి యొక్కెడ నున్నచోఁ గలహ మిరువురైన ఘర్షణంబు
నొక్కఁడైన సౌఖ్య మొనఁగూడు బాలికావలయముల నిద్ధి వాస్తవంబు" ౬౫౫

కం॥ అని మనమున ననుకొని నేఁ దనయను దనుజాతు గృహిణిఁ ద్యజియించి వెసన్
జనితిఁ గడుదూర మేటిపోయినదియు నాయర్ధదేహ మెఱుఁగకయుండన్, ౬౫౬

ఆ॥ ఎచటఁ బ్రొద్దుగ్రుంక నచటఁ బరుండుచు నెదిలభించ వేళ కదిభుజించు
చిలఁజరించుచుంటి నిబ్భంగి సంసారబంధమెడలి ప్రజలె బంధువులుగ, ౬౫౭

కం॥ అంత మెలమెల్లగ నాకెంతయు జ్ఞానంబుగలిగె, నిప్పు డతీతా
గంతవ్యవర్తమానోదంతంబంతయు నెఱుంగ దక్షుఁడనైతిన్, ౬౫౮

ఉ॥ ఈవిధ మస్మదీయసుత కేను సుశిష్యుఁడనైన వాఁడ భూ
దేవతలార! యుష్మదుపదేష్టలతో రెడియన్న ప్రశ్నకున్
నావిరి యుత్తరంబిదె, యథాస్తవమౌనుడి యెంతమాత్రమున్
సేవచియింప మీయెదుట నిశ్చయమిద్దియటం చెఱుంగుఁడీ, ౬౫౯

తే॥ ఇట్లు లోకోత్తరజ్ఞాన మేరుపడియె పుట్టికారంబులుగ నగ్రజన్ములార!
దానినుడివితి మీయెడందలకు నమ్మకంబుగలుగఁగ నీక నేమిగలదు చెప్ప" ౬౬౦

కం॥ "క్రతుభాగవివర్జితమగు క్రతుభుక్త్వముతోడ నాకుఁ గార్యముతే, ద
క్కృతమున మోక్షముఁగూరిచి యతించి సాధించువాఁడ నద్దాని వెసన్" ౬౭౨
వ॥ అనినవిని యంబుజాసనుం డఖిలాదిత్యుల కంజలిఘటించి ౬౭౩

మ॥ "వినుఁడీ నాదుహితోక్తి యెల్లసుర! లీవిప్రిందు నాయజ్ఞమున్
గన దూరంబుననుండివచ్చె యతియున్ జ్ఞానాఢ్యుఁడున్ నాగరుం
డును సత్పాత్ర మభీష్ట మిత్తుమనుచుం దొల్తొల్త నస్నార మం
దునఁ దద్వాంఛితపూర్తిసేఁత మనకుం దోడ్తోఁ బ్రశంస్యంబగున్" ౬౭౪
వ॥ నావుడు మహేశ్వరుం డిట్లనియె. ౬౭౫

—♦ అతిథిపూజా మహాత్మ్యము ♦—

ఆ॥ "యజ్ఞభాగభోక్తయైనయప్పటికంటె నెక్కుడైనతృప్తి యితఁడువొంద
నొకటి చెప్పఁదలఁచియున్నాఁడ దేవతల్! వినుఁడు సావధానమనసులగుచు,
ఉ॥ ఈక్రియమాణయజ్ఞమున కీశుఁడు విష్ణువు, యజ్ఞపూరుష
ప్రాకటకీర్తి యాతనికిఁ బర్యవు కిద్దియె హేతు, వట్టిసు
శ్లోకునికన్న నియ్యతిథి శుద్ధమనస్కుఁ డెఁ గీర్తనీయుఁ డీ
లోకములోనఁ బైతృకము లోనగు కర్మములందు ముందుఁకన్, ౬౭౭
తే॥ తనదునామముకీర్తించు వెనుక యజ్ఞపురుషనామముకీర్తించి భూసురునకు
నన్న మొసఁగిన యజ్ఞాంశమబ్బునపుడుపడయుతమి కెక్కుడౌతమి పడయు నతిథి,
చ॥ అతిథికిఁబెట్టకుండఁ గృతమయ్యెడి శ్రాద్ధముఖాఖిలంబులున్
వితయయిపోవు భస్మమున వ్రేల్చు హవిస్సులవోలె భక్తిమై
నతనికి వైశ్వదేవవిధియాటయు వెంటనె విష్ణునామసం
యుతముగఁ బూజసేసియిడు నొక్కకణంబును నక్షయంబగున్, ౬౭౯

వ॥ అనిన విని బ్రహ్మ విష్ణు పురస్సరులగు బర్హిర్ముఖు లందఱుం దథాస్తని, రవి
మొదలుకొని యతిథిపూజ యేర్పడియెఁగాన యత్నపూర్వకంబుగా నతిథిపూజ యనవ
రతం బాచరించుచుండునది, యజ్ఞపురుషు గౌరవించి యతిథి నవలఁదోసియు టనర్హం,
బతిథిపూజకన్న గృహస్థులకు వేఱొక ధర్మం బుండ, దెవనియింటినుండి యతిథి
భగ్నాశుఁడై మరలు వానికిఁ దన పాపమొసంగి పుణ్యంబు గొనిపోయెడి. ౬౮౦

సీ॥ అతికష్టములువచ్చి నప్పుడేని యబద్ధమాడకుండునుగాక యధికదీక్ష
నిష్ఠాకలైనతము నీర్వోసికదుగు సదాచారవంతుండె యగునుగాక
తలక్రిందుగాఁబడి తపముసేయునుగాక యొడలు శుష్కింపఁజేయుచుఁ గరంబు

పఠియించుచుఁగాక దేవనిగఁ దాఁ గూర్చుండి యొగిని సాంగోపాంగముగను శ్రుతులు
విద్వద్వనీసురులఁ బిల్చి వేనవేలు బహుగతుల్ చేయుచుఁగాక యొప్పటికినపుడె
దొలిసత్కార్యములు చేయుచుండుఁగాక యతిథిఁ బూజింపకున్న నయ్యవి వృథాయ.

వ॥ దూరంబునుండివచ్చి యతిథి యలసియుండు సుఖింతురో వాఁడే గృహస్థుండు గాని యన్యులు గృహరక్షకుల, పూర్వజన్మంబునఁ బుణ్యముచేయని పురుషులకు శ్రద్ధ దాన ప్రియోక్తులు ఘటింపనేర, వతిథిని సంతోషపెట్టిన నఖిలామరులును సంతోషపడుదు, రతఁడు విముఖుఁడైన నందఱును విముఖులగుదురు కావునఁ బుణ్యసమృద్ధిఁగోరు వాఁడు ప్రాణపరిదానముచేసైనను నతిథి నానందపెట్టునది. శ్రాద్ధీయుఁడు వైశ్వదేవీయుఁడు సూర్యోఢుండు నని యతిథి త్రివిధంబుల వర్తిల్లెడి. భోజనార్థాగతులగు తక్కిన వారందఱును సామాన్యులనంబడియెదరు. శ్రాద్ధసంకల్పానంతరము వచ్చువాఁడు శ్రాద్ధీయుఁడు. దూరపథంబునుండి శ్రాంతుండై వైశ్వదేవాంతమున వచ్చినట్టివాఁడు వైశ్వదేవీయుఁడు, తత్పూర్వము వచ్చువాఁ డతిథియనంబడఁడు.

సీ॥ ఆప్తులనువచ్చి యక్కఱదీర్చుచుఁ జాలఁగూర్చెడి ప్రాణసఖుండు గాని
యింటిలోఁ దినుచు నయ్యింటివారి తెక్కలుపెట్టంగఁజూచు నప్రియుఁడు గాని
పొట్టఁబొడిచిన నొక్కపోడియక్షరము గూడ నుండని శుద్ధమూర్ఖుఁడు గాని
సభలలో మెప్పొంది సత్కృతుండగుచు సుద్ధండుఁడైనను పండితుండు గాని
వైశ్వదేవవేళ వచ్చినవాఁడెపో యతిథి స్వర్గమిచ్చు నతఁడె గృహికి
గోత్రమాత్ర మెఱుఁగఁగోరక జందెముం గనియు దుమువఁబెట్టఁజనుఁడు నతిథి, ౬౭౭

వ॥ శ్రాద్ధవైశ్వదేవములయందతిథి యరుదేరకున్న నతనివేర నగ్నియందు దాజ్యాహుతి వ్రేల్చునది, యయ్యతిథి కన్నదానమాచరింప నశక్తుఁడగువాఁ డతఁడు తృప్తిపడున ట్లల్పాహారమైన నర్పించి యనుపునది. భోజనానంతరమో రాత్రివేళనో వచ్చినయతిథి సూర్యోఢుండని చెప్పంబడు. నతనికి యథాశక్తి నన్నమో ధనమో ధాన్యమో యర్పించునది. ౬౭౮

సీ॥ చామలు నివరి దూసరి గంటె గునుగులు మొదలైన తృణధాన్యములకు నేని
ఛదసంచయముల నాచ్ఛాదింపఁబడి వినిర్మలత నొప్పారు భూస్థలులకేని
ప్రోదినీకమలాకరాంధువాపీముఖానీతంబులగు మంచినీళ్ళకేని
సత్యేతరంబులై స్వాంతంబు రంజింపఁ గడుసమర్థములైన నుడులకేని
లోప మెవరియింటిలోపల నుండదు వానివానిచేత నేని యతిథి
నాదరించిపంపనగుఁ జూడీ గార్హస్థ్యమూనియున్న సుజనులుర్వియందు, ౬౭౯

సీ॥ స్వాగతంబిచ్చిన సంప్రీతిపడుఁ గడుం జిత్రభానుండు తాను జిత్తమందు
నాసనంబొసఁగిన నానందముంబొందుఁ దచ్ఛతానందుండు తాఁ గరంబు

పావనతమమైన పానీయములతోడ నర్ఘ్య మర్పించిన హారుఁడు తనియు
భక్తిమైఁబూజించి పక్వాన్నములతోడ నన్నదానము సేయ హరియుమరియుఁ
బాద్యమీయఁగఁబడ దిక్పతిమొదలగు క్రతుభుజు లీప్రీతులయ్యెద, రతిథి సర్వ
దేవతామయుండటు గాన దినదినమును నర్చనీయుండతండుర్వి నధికభక్తి, ౬౦౬
ఆ॥ అర్చనీయుఁడైన యతిథి రాకున్నచో నతని పేరుచెప్పి యన్న మేని
యనువఁబెట్టవలయు నడువక గృహమేధియైనయగ్రజన్ముఁ డర్హ్యభంగి" ౬౦౭

వ॥ అనియిట్లు చెప్ప సూతుండు వెండియునిట్లను. "విప్రోత్తములారా! యట్లు
మహేశ్వరాయుడు పలుకుటయు నతిథి ౬౦౮

ఆ॥ "హాటకేశ్వరాఖ్యనలరు నీక్షేత్రమం దొకటఁ దిపము సలిపియుంటెఁ బూర్వ,
మమరిపించియుంటి నటనొక్క తీర్థంబు స్నానదానములను సలుపుకొఱకు, ౬౦౯

కం॥ మంగళవారముతోడను సంగతమగు చవితినాఁడు సకలామరులున్
బొంగుచుఁ దత్తీర్థంపుఁ గురంగట వసియింపవలయు రాత్రిందివముల్, ౬౧౦

ఆ॥ ఆదినంబునందె యాతీర్థమందున స్నాతులైనయట్టి జనములకును
సర్వతీర్థఫలము సమకూరవలయును ద్వత్ప్రసాదమునను దక్షణమున" ౬౧౧

—• ప్రస్థాని విశ్వావసువును శపించుట •—

వ॥ అనిప్రార్థించుటయుఁ దత్సురోత్తముఁడెల్లరుం దథాస్తని రంత కాలవదినం
బున ఋత్విజులు యజ్ఞకర్మ మారంభించి సోమపాన పశుహింసాదికంబు నిర్వర్తించు
టయుఁ బ్రస్థాత యజ్ఞవాటంబునకు సమీపంబునం బ్రవేశించి తత్పశుగుదమాంస
హోమశేషత్వరత్వంబున వ్యగ్రుండైయుండ మాంసభక్షణలాలసుండగు నొక్కయువకుండు
సనుదెంచి యద్దాని భక్షించె. భక్షమానుండగు నతని విలోకించి ప్రస్థాత ౬౧౨

కం॥ "ఛీ-ఛీ! హోమము సేయను నీచా! పశుగుదముని చట నేఁబెట్టుకొనన్
నీ చాపల్యముచూపుచు మాంచారితి దూష్యమయ్యెఁబోయది యింకన్, ౬౧౩

శా॥ స్వచ్ఛంబైనపదార్థసంచయమె కా సప్తార్చి హోతవ్య, మీ
యుచ్ఛిష్టంబును బెట్టి యెట్టులిఁక నే హోమంబు గావింతురా?
తచ్ఛిష్టేతరులైన రాక్షసుల వేతద్దుష్క్రియ ల్గాన నో
తుచ్ఛా! నీవును రాక్షసుండవగుచున్ దుఃఖింపుమా యింతటన్" ౬౧౪

వ॥ అనిశపించుటయు ౬౧౫

సీ॥ ఈక్షణంబులు రెండు నెఱ్ఱనై కనుపట్టె నెత్తివెండ్రుక లెల్ల నిట్టనిలిచెఁ
బాచిపట్టికరంబు పండ్లు నల్లగనయ్యెఁ గడ్డము లోమ్ములకరణిఁదోఁచెఁ
గడు భీషణంపు టాకారంబువాటిల్లె దిగజాటెఁ గ్రిందికి మిగులఁ బెదవి
కోలమొగం బొడ్డనున్ భీతిపుట్టించె మాంసంబు మేదస్సు మంటఁగలసె

నరము లెముకలు చర్మముం గడకు మిగిలెఁ దలఁపునకుఁ దెచ్చెఁ జాముండ దర్శిష్టజనుల
కిట్లు రాక్షసభావంబు నెనసెనతఁడు తత్క్షణంబునఁ దచ్ఛాపసత్త్వరయముల, ౧౯౬

సీ॥ అఖిలప్రపంచంబు నవలీలసృజియించి తనరారునటువంటి ధాతృపౌత్రు
సకలవాచంయమసంస్తూయమానుఁడౌ నల పులస్త్యమునీంద్రు ననుఁగుఁగొడుకు
వేదవేదాంగాది వివిధవిద్యలు గూడ శ్రద్ధమైఁ జదివిన సన్మనీషి
క్షమను విశ్వావసుసమభిధానంబుచేఁ బిలువంగఁబడియెడి యలఘుచరితు
మంత్రపూతమైనమాంసంబు దినుటకై యేగుదెంచి భూసురేంద్రుచేత
శప్తుఁడైన యానిశాచరాకారుని జూచి యచటనున్న శ్రోణిసురులు, ౧౯౭

సీ॥ కొందఱు చనిభీతి గోరాజవాహను కాళ్ళపైఁబడి రీశ! కావుమనుచుఁ
గొందఱుపోయి యాయిందీవరాక్షుని శరణంబొందిరి రక్ష హరి! యటంచుఁ
గొంద ఱేగి రయంబ బృందారకజ్యేష్ఠుఁ బ్రాపుఁజొచ్చిరి దేవ! పాహియనుచుఁ
గొందఱు గాయత్రికూరుచుండిన యజ్ఞశాలఁ డాఁగిరి యంబ! యేలుమనుచుఁ
గొందఱు జపించి రెంతయు గుండెపగిలి శుద్ధమనమున రక్షోఘ్నసూక్తములను
నంద అన్నివిధంబులఁ దొందరపడి వందురి యతండు తనదైనచందమునను, ౧౯౮

వ॥ కనులనిండ గిరగిర నీళ్ళుదిరుగ బ్రహ్మపాలికిం బరువెత్తి ౧౯౯

కం॥ "మనుమఁడ నీకుఁ బులస్త్యుని తనయుఁడఁ బ్రద్ధాతృశాపదగ్ధుఁడనై యీ
దనుజాకారముదాలిచితిని జిహ్వాలౌల్యమునను దిని పశుగుదమున్, ౨౦౦

కం॥ ఎఱుఁగక హోమార్థముగం బరికల్పితమైనదాని భక్షించితి నో
పరమేష్ఠి! తిరిగి నరత న్దరుణించుచు రాక్షసత్వనాశకుఁడగుమా" ౨౦౧

వ॥ అనినవిని పితామహుండు ప్రద్ధాతతో సామపూర్వకంబుగా నిట్లనియె. ౨౦౨

ఆ॥ బాలకుండు నాదుపౌత్రుండు వీఁడు గుఱ్ఱెఱుఁగఁ డెదియుఁగాన నెంతయును స
హించి రాక్షసత్వ మెడలఁగఁజేయుము మహీసురేంద్ర! నాదుమాటవినుము" ౨౦౩

వ॥ అనినవిని యమ్ముని ౨౦౪

ఆ॥ "పశుగుదం బశుద్ధపఱచి ప్రాయశ్చిత్తమును జనింపఁజేసె ననఘ! యితఁడు
గాన యజ్ఞవిఘ్నకరుని శపించితి నెపుడు రాక్షసత్వ మపనయింప" ౨౦౫

వ॥ నావుడు బ్రహ్మదేవుండు ౨౦౬

క॥ ఏతత్క్రతుసిద్ధికిఁగా నాతతగోభూప్రదానహవనములెల్లన్
జేతును బ్రాయశ్చిత్తం బీతని దైతేయభావ మెడలింపు దయన్" ౨౦౭

వ॥ అనుటయు మరల నతండిట్లనియె. ౨౦౮

కం॥ అనలము శీతలమగుచో వనజారికి వెచ్చఁదనము వచ్చెడిచో నే
ననుమాట యన్యథాయౌ ననిమిషపరిభావితామలాంఘ్రిసరోజా! ౨౦౯

౭ నారాయణరావుగారు, దాతారుపల్లె

౮ వేలూరి రామన్న గుప్తగారు, సదాశివుని పేట

౯ రాయచూరి బండేరావుగారు, అయినాపురం.

౧౦ రామారి సుబ్బయ్యగారు - శ్రీ శ్రీ విరూపాక్షసంస్థాన ప్రధానమంత్రి

౧౧ ఘంటంభట్లగారి వెంకటభుజంగముగారు - ముసలాపురం

౧౨ దండు గుండేరావుగారు, కరణము - ముసలాపురం

౧౩ తిగుళ్ళ కృష్ణారెడ్డిగారు. పటేలు - ముసలాపురం

౧౪ కాకుమాను హనుమయ్యగారు, నర్సారావు పేట

౧౫ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణం, దుగ్గిరాల

౧౬ భాస్కరరాయుని వెంకట రామయ్యగారు, వంగపల్లి

౧౭ నరసింహస్వామివారు, యాదగిరి

౧౮ బీరకాయల హనుమంతరావుగారు, రాయగిరి

౧౯ జూలూరి వెంకటకల్పముగారు, వకీలు, గుంటూరు

౨౦ మెదక్ కిషన్ రావు దేశముఖు గారు, నల్లపల్లి

౨౧ జానపాటి సుబ్రహ్మణ్యంగారు, పాపయ్యపాలెము

౨౨ చిక్కరాజు పట్టుపల్లి రావుగారు, కరణం, చెలకుర్తి

౨౩ కవులూరి నరసింహారావుగారు, ఈలపోలు

౨౪ గోటేటి వేణుగోపాలరావుగారు, పోలీసుసబిన్స్పెక్టరు, పత్తిపాడు

౨౫ నడింపల్లి నరసింహారావుగారు, రిజిష్ట్రాఫీసు క్లార్కు, క్రోసూరు

౨౬ రాచకొండ వెంకటరామయ్యగారు, యెనమదల

౨౭ కప్పగంతు సుబ్బారావుగారు - పోలీసుసబిన్స్పెక్టరు - పిడుగురాళ్ళ

౨౮ మండ చినవెంకయ్యగారు, దండమూడి.

౨౯ శ్యామాపంతుల గోపాలరావుగారు - వరంగల్లు.

౩౦ కన్నయ్యగారి సంగయ్యగారు-ముసలాపురం

౩౧ చక్కిలం పాపయ్యగారు-ముసలాపురం

౩౨ తాళ్ళవెలిమె లింగన్న మొకద్దంగారు-గడి పెద్దాపురం

౩౩ కిషన్ రావు దేశపాండ్యాగారు తాళ్లపల్లి

౩౪ తొర్లకొండ లక్ష్మారెడ్డిగారు, క్షీరసాగరం.

౩౫ రంగరాజు గోపాలకిషన్ రావు - దేశముఖుగారు, పాపురం

౩౬ చివుకుల శ్రీరామశర్మగారు- నాగులుప్పలపాడు

౩౭ గజవాడ వెంకటాచార్యులుగారు, అల్లాదుర్గము

౩౮ కాకిరాల రామచంద్రయ్యగారు, మనుబోపురము

౩౯ లక్ష్మీనారాయణ గౌడు సెట్టిగారు, అందోలు

# అభినవసరస్వతి

సంపాదకుఁడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది, యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనములును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 1-0-0

## ఈ కార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | కరణీకోద్ధారిణి [పూ॥రి వీరభద్రకవి] | ... | 0 | 4 | 0 |
| 2 | వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 3 | కంసవధ నాటకము | ... | 0 | 8 | 0 |
| 4 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) | | 0 | 4 | 0 |
| 5 | విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 6 | నీతిగీతలు (సుమతిశతకమునకు సంస్కృతము) | ... | 0 | 2 | 0 |
| 7 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 8 | విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 9 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్రికాధిపతి) | ... | 0 | 4 | 0 |
| 10 | సంకరదోషము | ... | 0 | 3 | 0 |
| 11 | అస్పృశ్యతానివారణ ఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 12 | వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 13 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) | ... | 0 | 4 | 0 |
| 14 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) | | 0 | 3 | 0 |
| 15 | పశ్యంపుశ్యం | ... | 0 | 2 | 0 |
| 16 | పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 17 | పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 18 | శంతనురాజచరిత్ర | ... | 0 | 14 | 0 |
| 19 | వర్ణవ్యవస్థ | ... | 0 | 4 | 0 |
| 20 | స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 21 | శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 22 | అభినవశాకుంతల నాటకము | ... | 0 | 8 | 0 |
| 23 | సూతసంహిత-ఆంధ్రము | ... | 2 | 0 | 0 |
| 24 | స్కాందమహాపురాణాంతర్గతనాగరఖండము ( ౧ సంపుటము ) | | 1 | 0 | 0 |
| 25 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 26 | భారతీయప్రబోధము (పిడుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 27 | ధర్మనిర్ణయము. | | 0 | 4 | 0 |
| 28 | భారతకథాతత్త్వనిర్ణయము(మల్లాదిరామకృష్ణవిద్వచ్చయనులుగారు) | | 0 | 8 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళపోస్టు,
గుంటూరు జిల్లా.